శ్రీరామజయము.

శ్రీమదాంధ్రమహీమండల మండనాయమానం బగు గుంటూరు పురంబున అరండల్పేటలో శ్రీ పాటిబండ సూర్యనారాయణరావుగారిచే స్వగృహ సమీపమున నొక నూతన దేవాలయము నిర్మింపఁబడియె. ఈదేవాలయ నిర్మాణపద్ధతికిని పూర్వపు దేవాలయ నిర్మాణ పద్ధతికిని చాల భేదము కలదు. వెనుకటి దేవాలయంబులనున్న మూల విరాట్టులు దేవాలయంబునఁ బ్రవేశించినవారికిఁ గాని గోచరంబులు గావు. ఈనూత్ననిర్మిత దేవాలయమునందలి మూలవిరాట్టులు అవీధిలో నెచ్చటనుండి చూచినను నేత్రగోచరంబులై చూచు భక్తులకు మహానందసంధాయకములై యెట్టివారికేని హృదయాకర్షకములై భక్త్యుద్రేకమును గలిగింపక మానవు. ప్రాచీన దేవాలయమ్ములు,

గర్భగేహములందు శుభ్రవాయుప్రచారంబునకు వీలు లేక గబ్బిలములు, మూషకములు మున్నగు క్షుద్రజీవమ్ముల కునికిపట్టులై, గాఢాంధకారబంధురమ్ములై, దుర్గంధభూయిష్ఠంబులై స్వామిసన్నిధయందొక క్షణమేని నిల్చుటకుఁ దగిన యుత్సాహము గలిగింపక ప్రేక్షకుల కసంతుష్టికరములై యుండును. ఈ క్రొత్త దేవాలయము దృగ్గోచరమైనఁ జాలును. ఎట్టి నాస్తికునకైనను మనస్తుష్టినొందక మానదు. గర్భాలయమునందు పరిశుద్ధవాయుప్రచారముండుటయు, వెలుతురు నిరాటంకముగను బాహ్యమునను శిల్పమును చెలంగుచుండుటయును ఈ దేవాలయమును ఇతరాలయములకంటె వైలక్షణ్యమును దెచ్చుటకు ముఖ్యకారణములు. ఇట్టి నవీన నిర్మాణపద్ధతి శ్రీ సూర్యనారాయణరావుగారి మనంబున స్ఫురించుటకుఁ దదస్ఖలిత భక్తిపరవశుఁ

డగు శ్రీమదాంజనేయుని యనుగ్రహమే నిశ్చయింప
వచ్చును. మఱియు నీదేవాలయమును నాటించి యీ మహాపురుషుండే
యొక్క దృఢసౌధమును నిర్మించి యందు వివిధ సంస్కృతాంధ్ర
గ్రంథరూపిణి యగు సరస్వతీం బాండు బ్రతిష్ఠచేసి యుంచుటచేత
"స్వామిదర్శనమువలన నెప్పుడో జన్మాంతరమున ఫలముకల్గును" అను
కిం వదంతి మిథ్యయై తత్కాలముననే గ్రంథదర్శనజమగు జ్ఞానరూప
ఫలము లభ్యమగుట గొప్ప విశేషము ఇంతియుగాక యీ భక్తవరుం
డు, శ్రీమదాంజనేయునందుం గలవని మనము చెప్పికొనునట్టి సర్వవిధ
మహిమలను జక్కంగ సహేతుకముగ సమర్థించుచు స్వభక్తిపారవశ్య
మును దెల్పునట్టి ముప్పదియారు పద్యరత్నములను ధారాశుద్ధియు
భావస్ఫూర్తియు రసపుష్టియు మిప్పిరిగొనునటులు రచియించి శ్రీస్వామి

వారి కర్పణచేసెను. ఈపద్యముల నొక్కొక పద్యమున కొక్కొక సప్రదక్షిణ నమస్కారము వంతునఁ ద్రిరావృత్తముగఁ బఠించినచో అష్టోత్తరశతసంఖ్యాక ప్రదక్షిణ నమస్కారములు సిద్ధించును. ఈ ముప్పదియాఱు పద్యరత్నములకును 'శ్రీహనూమత్స్తవరాజము' అని పేరు. "చిన్న గుళ్ళు చాలవా యీదేవాలయమేల" యని కొందఱకు ప్రస్తుతకాలీనుల కున్నను తొంటి దేవాలయములకన్న ననేకరీతుల నీ దేవాలయము ప్రకృతకాలమునందుఁగూడ బహు లాభకరమైన దనియే నాదృఢ నిశ్చయము. ఆర్యమహాశయులారా! 'కింబహునా' యను నట్లు పెక్కు వ్రాయనేల, దేవాలయముల నిషేధించువారే నియు నీ దేవాలయము నొక్కమారు గాంచినచో, నిట్టి దేవాలయము లావశ్యకములు అనకపోరు. కావున యీ దేవాలయమున నెలకొన్న

మూ విరాజితుం డగు శ్రీమదాంజనేయస్వామి, దినదిన ప్రవర్ధమానసాన్నిధ్య బలముకలవాఁడై, శ్రీహనూమత్స్తవరాజముచేఁ దనను బాగుగ భక్తవరులకు నశేషైహికాముష్మిక క్షేమముల నొసంగుచు నాచంద్రతారముగ శ్రీ పాటిబండ సూర్యనారాయణరావు గారిని బ్రోచుఁగాత.

ఇట్లు విన్నవించువిధేయుఁడు,

7-4-1920 కాశీ కృష్ణాచార్యులు.

శ్రీహనుమతేనమః.

# విజ్ఞప్తి.

మహాభక్తుఁడు నిష్కళంక ప్రవర్తనుఁ కవియునైన మా తండ్రి పాటిబండ వేంకటప్పయ్యగారి యాశీర్వాదమువలనను, భగవత్కృపవలనను బాల్యమునుండియు నాకు మానసికభక్తి సహజమై యున్నది. నాజన్మస్థానమైన సత్తెనపల్లి తాలూకా పాటిబండ యను గ్రామములో గ్రామముమధ్యను సహజముగాఁ బుట్టిన కొంచమెత్తు గల యొక చిన్ని బండమీద నాలుగుస్తంభముల మంటపములో శ్రీ ప్రసన్నాంజనేయస్వామి ప్రతిష్ఠింపఁబడియుండెను గుడిలోనికి బోవలసిన యవసరము లేకయే, యర్చకుఁడువచ్చి తలుపుదీయవలసిన ప్రసక్తి లేకయే, యాస్వామి ప్రత్యక్షమగుచుండును. స్వామివారికి పేరిట

కులు నమస్కరించినను నమస్కరింపకున్నను ప్రేక్షకులను బిలచి వారికి స్వామివారే భక్తి ప్రపత్తి మార్గములను శిక్షించుచుండెనో యన్నట్లు తోచుచుండును. నాకుఁగల సహజభక్తిచేతను స్వగ్రామములోఁ గల శ్రీ ప్రసన్నాంజనేయస్వామివారి యాలయ విగ్రహముల వైఖరివలనను, గుడియు దేవుఁడును భక్తి ప్రేరకములుగా నుండవలయునని మనమున దృఢముగా నాటియున్నది.

గుంటూరు అరండల్పేటలో నేను స్వగృహమును సంపాదించుకొన్న పిమ్మటఁ దత్సమీపములో మఱికొంత నివేశనస్థలము సంపాదింపఁదలచి యాస్థలము లభించు ప్రయత్నము విషయమై ముచ్చటించుచు నొకనాఁడు విలాసముగా మాటలసందున ఆస్థలము లభించునెడ నందొక చిన్ని యాలయము కట్టించు కోర్కె గలదని చెప్పితిని. కష్ట

ముందాద ఆస్థలము తరువాతఁ గొంతకాలమునకు లభించెను. వారితో
గొంటి గద్దెద్రవ్యమును ప్రయత్నించి భూమిమట్టముమీఁద చిన్నదద్ద
కముగ నేర్పఱుప నూహించితిని. ఏదేవుని యాలయమో నిర్ధారణ
చేయు విషయమున, మానసిక సహజభక్తియు, జన్మస్థానమందున్న
శ్రీ ఆంజనేయస్వామివారి యాలయ వైభవము, గుంటూరు అరండల్
పేటలో ఆస్వామివారి గుడి లేకపోవుటయు ఆస్వామివారే సర్వసమ్మత
దైవముగా నుండుటయు నన్ను ప్రేరేపింప శ్రీ ఆంజనేయస్వామి
వారిని ప్రతిష్ఠింప నిశ్చయించితిని. పిమ్మట జన్మస్థానములోఁగల గుడికి
దేవునికి ఔన్నత్యమును దెచ్చుచు గ్రామమధ్యమున సహజముగా
నున్న చిన్న తిప్పవంటిది యిచ్చుట నేర్పడిన బాగుగనుండెడి యని
తోఁచెను. గుంటూరులోఁ గొండయేర్పడుటెట్లు అంతట నేనైనను

నారేయుసుకొని కొంచమెత్తైన చిన్నికొప్పులాగు కట్టడము నేర్పరుప
వలయునని నిశ్చయించి జన్మస్థానమునే మాతృకగా గ్రహించితినిగాన
దీనికి “ధర్మాచల” మను పేరిడ సంకల్పముచేసి అది ఆచంద్రతారా
ర్కము సార్థకనామధేయముగా నుండవలయునని దేవుని ప్రార్థించి
తిని. తదన్నను ప్రత్యక్షమై ప్రజలకు భక్తిని ప్రోత్సహించురీతి ప్రధాన
మూర్తిగా శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివారిని అందు ప్రతిష్ఠింప
దలచి శ్రీ ప్రసన్న వీరాంజనేయ మూర్తులుగూడ నందుండ నేర్పరచి
ధర్మాచలమందుండు స్వామి “త్రిమూర్తిహనుమంతు” డని పిలువ
నెంచి శ్రీ హనుమత్స్వామి త్రిమూర్త్యాత్మకుడుగాన ఆపేరు అన్ని
విధములు సార్థకమని సంతసించితిని. అంతటితో తృప్తిజెందక ప్రస్తుత
కాలములో దేవాలయములు విద్యావంతులకును, ఉద్యోగస్థులకును,

పఠన మందిరములవలెను (Town Halls) సమావేశమందిర (Clubs) ములవలెను రుచించి ప్రోత్సాహము ఆకర్షింపకపోవుటచేత అట్టివారిని సమితము రప్పించు మార్గమాలోచించి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులవారిని సంప్రదించి వారి సంపూర్ణామోదమును బడసి యాలయములో భాగముగా గ్రంథాలయము నేర్పాటుచేయ నుద్యమించితిని. కోర్కెలు ఊహాలు అడ్డులేక పొంగి పొరలుచుండెను. గాని శక్తిమాత్రము అతిహీనమై మనసును గష్టపెట్టసాగెను. కోరినదియు ఊహకుఁ దోచినదియుఁ గావలయునను పట్టుదలమాత్రము సహజముగ నున్న దానికన్న నెక్కువగా నన్నావరించుచుండెను. అన్నివిధముల సమర్థుఁడయిన మహానుభావుఁడు శ్రీహనుమంతుఁడుండగా కొంత లేనిచోటఁ గొండసమకూరుటగాని, శక్తిలేనివాఁడు పెద్ద గుడిని కట్టుటగాని అసం

భవములు గావను నమ్మకము మనసులో స్థిరమగుచుండెను. ఆరంభ ములో దలపెట్టినదానికి బెక్కురెట్లు పనియు ప్రయాసము వృద్ధిగా సాగెను. దైవమునందు భారమువైచి చలనము మాత్రము చెందకుంటిని. మధ్య మధ్య "నాకేడలంతటిపని దక్కునేడ" యను శంక దోచుచు వచ్చినను శ్రీ హనుమత్స్వామి పరిపూర్ణకృపాకటాక్షసామర్థ్యములవలనం బని పూర్తిగాంజొచ్చెను. మనసు సదా భక్తిపూరితమయి ఆ స్వామివారిని ధ్యానింపం జొచ్చెను. అట్లు రచించిన స్తవమే "శ్రీహనుమత్స్తవరాజ" మను ఈ చిన్న పొత్తమునం బద్యరూపముగా నున్నది. ఒక్కొక్క ప్రదక్షిణమునకు నొక్కొక పద్యము చాలినదై ప్రదక్షిణాంతమున దేవుని దర్శనము గల్గునప్పటికిఎదురుగా నిలచి "నమస్కరింతు హనుమంతా నీ మహాశక్తికిన్" అని మకుటముచే ప్రణమింపందగి యుండును.

నా యాశయుఁ గోర్కెయు వ్యర్థముగానీక నా యభిప్రాయ
మును సంపూర్ణముగా గ్రహించి జనాకర్షణము, భక్తిప్రేరణము గలి
గించు నసాధారణ సుందర శిలావిగ్రహమును బూర్తిచేసి యిచ్చిన
విఖ్యాతశిల్పియగు మైలాపూరు శ్రీ ధనాచలాచారిగారు నాకృతజ్ఞతకు
నెంతయుఁ బాత్రులు. నేఁబూనిన పనిలో నన్నుఁ బ్రోత్సాహపరచు
చు నామోదమును జూపుచు సౌహృదయ పూర్వకముగా నాకు సాయపడి
ఆలయనిర్మాణ కార్యము యొక్క శాస్త్రీయ కౌల్యమునకు భంగము
రాకుండఁ బరీక్షించుచు నా చేసిన హామామత్త్వమును బరిశీలించి
ప్రశంసింపఁబరిశోల్పిన విద్వద్వరేణ్యులగు బ్రహ్మశ్రీ కాశీకృష్ణా
చార్యులవారు అత్యంతము నాకు వందనీయులు. సార్థకమగునట్లు ప్ర
యమైన ధనమును నేగడించుటకుఁదగిన విద్యాబుద్ధులు చెప్పించి

పుత్త్రులరీతి నన్ను సాకిన మత్పితృవ్యులగు బ్రహ్మశ్రీ పాటిబండ వేంకటరమణయ్య పంతులుగారు సదానాకు స్మరణీయులు. ఆలయనిర్మాణకార్యమునఁ గలుగుచు వచ్చిన యధైర్యమును, మధ్యమధ్య గలుగు పనుల యాలస్యమువలని భయమును, దలచినపని నైనప్పుడు గలిగిన సంతోషమును వెలిపుచ్చుచు శ్రీహనుమత్స్వామి కృపాసామర్థ్యములను గూర్చి తాత్కాలికముగా రచియించిన యెన్మిది పద్యముల సైతము నీక్రిందఁ బొందుపఱచుచున్నాను.

మ॥ భవదీయంబౌ చిన్న మండపమొని • ర్మాణంబూని యొక్కింతదా
దవులంగల్గు శిలాచయంబెటులఁ బ్రా • ప్తంబౌనటంచుంగ భయం
బవురా! యేటికఖండదూరగత భూ • ర్యద్రిప్రకాండంబుఁ జే
రవడిం దెచ్చిన నీవెయుండ హనుమం • తా! నిన్ను సూనమ్మితిన్॥

శా॥ ఉత్తుంగోర్వీ ధరాగ్రవాసుఁడవు గుం • టూరన్ భవద్వాసమే
హత్తింపం దలపోసి సాధ్యమదిగా • దంచెంచియున్ నీపయిం
బత్తిం జేయఁగ, భూరిశైలవహన • ప్రాప్యుండవీ చోటనా
యత్తంబయ్యె భవద్గ్రహంబు హనుమం • తా! నీ సహాయంబునన్॥

శా॥ ఆసక్తిన్నిరతంబు తావకపద • ధ్యానంబు ప్రాపింపఁగా
నాసద్భక్తిపజ్జ నీ కావఁగీర్తిన్ • సాధింతు; మజ్జన్మమం
తే సాఫల్యముఁ జెంద నందునికన్ • వేవేగ రావే! భవ
ద్దాసత్వంబూన గూర్చి ప్రోవ హనుమం • తా! నిన్నుదాఁ గొల్చెదన్॥

మ॥ చిరమేకాయు మశక్త మానవుఁడ; నా • చే దుర్ఘటంబైన మం
దిరమొండ్రున్ రచియింపఁ జేసితివి; త్వ • ద్వీరప్రశస్తి ప్రప

త్రిరసోద్భాసిత మహాత్రింశ డగుసిబ్రీ తిన్నిపు వేంచేసి నా
ద్వరతోఁ జేయఁగదే కృతార్థు హనుమం తా! నీకృపాదృష్టిచే॥

మ॥ ధన మొక్కింత నివ్వఁ జేయరుదు; త ద్భాగంబొకండైన మే
ల్పనికింబూన్పెడి కోర్కెయుబ్బరము; సం త్రారంభముల్ మృగ్యముల్;
మన ముప్పొంగడిచేత దుష్కరము;స • మ్యక్పూర్తికిన్ మొందువి
ఘ్నునికాయంబు; భవత్ప్రతిష్ఠ హనుమం • తా; నన్నెటుల్ తేర్చెదో॥

మ॥ ధనమా పుష్కలమైయొసంగదు; పర • ద్రవ్యాగ్రహాసక్తికిన్
మనమా పోదు! భవత్ప్రతిష్ఠ గను వా • నానాటికిం దాపుగాఁ
జనుఁదేసాగ! త్వదీయ శక్తిదృఢవి • శ్వాసంబు మాత్రంబు వ
ర్తనమై యుండెడి! దరించుటెట్లు హనుమం • తా! నీ కృపం గాకికన్॥

మ॥ ఆయుర్ధా, రిక్షుఁడు; భక్తిమాత్రభరిత స్వాంతాబునం గ్రొత్తదా
గుడినిర్మించి భవత్త్రిమూర్తుల పటం గూర్పంగయత్నంబు చా
ల్పెడు; దత్తత్క్రియలందు శాస్త్రవిధనల్ • పంబుల్ పరీక్షింపక
లేదు నీదాసుఁడటంచు సైచి హనుమం ! నన్ గటాక్షింపవే॥
శా॥ ఏమోచేసితి నీ ప్రతిష్ఠకయి; నా • యీ దుష్పిగంతుల్ బళా
నీముందా యికనేల ! భూభువనముల్ • నిండింతువీవే భవ
త్సామర్థ్యోన్నతిచే భవన్మహిమచే; • ధర్మాచలప్రోజ్జ్వల
త్స్వామీ! గర్తపురత్రిమూర్తి హనుమం • తా! విన్నదానమ్మతీ॥

రౌద్రినామ సం॥ర వైశాఖ
శు 5 లు ది 23-4-1920
గుంటూరు.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

భక్తుఁడు భాషాభిమాని,

పాటిబండ సూర్యనారాయణ॥

శ్రీహనుమతేనమః.

# హనుమత్స్తవరాజము.



శా॥ శ్రీరామాంఘ్రి నిరంతచింతనసము • జ్జీవన్మహో భక్తి వి
స్ఫారంబై సకలాగమోజ్జ్వలితమై • వంద్య త్రిమూర్తిప్రభా
కారంబై బలవీర్యశౌర్యమహిమైక బ్రహ్మచర్యవ్రతో
దారంబయ్యె; నమస్కరింతు హనుమంతా! నీ మహాశక్తికిన్॥ 1

శా॥ సీతం గన్గొని రామచంద్రుఁ బ్రతికిం • చెన్, రాముని న్దెల్పి సీ
తాతన్విం బ్రతికించె; మందుమలఁ జే • తం దెచ్చి సౌమిత్రి సం
ప్రీతిం దా బ్రతికించె; రాముకథ కు • ద్వ్యం బ్రాణమై నిస్తుల
ఖ్యాతి న్నించె; నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ ॥ 2

మ॥ ఖరతీవ్రాంశుసుహాగ్రతాసహనము • తుయ్యస్థికిం జెల్లిమే
కరణిం గల్గెనా! మింటలేచి భయశం • కాలేశశూన్యప్రభా
వరమై దుస్సహ చండభానుఁ గబళిం • పం జూచి లేఁ బ్రాయమం
దరుదై తోఁచె; నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ ॥ 3

మ॥ అతిసూక్ష్మస్థితి నయ్యశోకతరు ష • ణ్డాంతస్థమైయున్న యా
కృతి యత్యద్భుతలీల వేగమ దశ • గ్రీవోచ్చసింహాసన
ప్రతిభాతిక్రమణక్రియాక్రమ మహో • గ్రస్ఫూర్తితోడన్మహో
న్నతిమైక్రాలె నమస్కరింతు హనుమ • తా! నీ మహాకీర్తికిన్ ॥ 4

మ॥ ఒకచో నిల్వని లోకబాంధవు మహో • ద్యోగంబు భంగంబొన
ర్పక పూర్వాపరపర్వతాగ్రములపైఁ • బాదంబులన్నిల్పి చం
డకరాఘాతము లెక్కసేయ కవలీ • లన్నేర్చెఁ బో వేదశా
స్త్రికళారాశి; నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్। 5

శా॥ అంగంబెల్ల మహోన్నత ప్రకృతిభూ • మ్యాకాశముల్ నిండ సు
ప్పాంగం జేసి యనన్యసాధ్యమని వే • ల్పుల్ సేయు గీతాళి వే
భంగుల్ గా శతయోజనాయత మహా • వారాన్నిధిన్ లీలగా
న్లంఘించావు; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ 16

మ॥ సమరక్షోణి దశాస్య భీకరతరా • స్త్రప్రక్షేపసంవిద్ధకా
యమృతప్రాయత నేలగూలగ, వన • వ్యప్రౌఢి దూరస్థ దు
ర్గమసంజీవినగంబు వే గొని సుమి • త్రానందనప్రాణదా
నమునం గాచ్చె; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్॥ 7

శా॥ లంకామార్గ సముద్రలంఘన సము • ల్లాసప్రమోదప్రయా
తంకావిర్భవ ఘోరరూపసురసా • దంష్ట్రాకరాళాస్య ని
ష్కంకోత్పాతపునర్బహిర్గమనద • క్షుంబయ్యో క్షేమప్రతా
పాంకస్ఫూర్తి! నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్॥ ౬

మ॥ వనధిం దాటఁగ లేక నిల్చిన నిజ • స్వామ్యాత్మకుం బ్రీతిమై
కనుపింపం, బహుయోజనాయత మహా • గంభీరవారాశి పూ
డినదై సేతువుగాఁగఁ గేళి నిజము • ష్టిం దెచ్చి వైచెన్మహీ
ధ్రనికాయంబు నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్॥ ౭

మ॥ అవనీదైవతవంశ సంభవ దశా • స్య ప్రాణహాన్యగ్రిపా
పవిపత్కాలశివ ప్రతిష్ఠ నొనరిం • పంగోర్కి రామాత్మను
ద్భవిలన్ సేతువ్రజజ్ఞకోర్కి ఉణమా • త్రం దెస్పాంగాశీస్ఫుర
ద్భవలింగంబు; నమస్కరింతు హనుమం • తా నీమహాశక్తికి॥ 10

మ॥ అకలంకా ప్రతిమానవర్తన, సము • ద్యద్భక్తి విశ్వాస, కా
ర్యకృతి ప్రౌఢి, మతిప్రభావిభవ ల • బ్ధానన్య సాధ్యాఖిలే
ద్య కలాపోత్తమ రామచంద్ర కరప • ద్మాంచత్ప్రపూతాంగుళీ
యకమైమొప్పె; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్

మ॥ కమలాక్షోరగనాధదేవ మహిమాం కచ్ఛాదకాంగాది సం
భ్రమకాంతార పరిభ్రమద్రఘుకుల • స్వామిద్వయాంతర్విభా
సి మహత్త్వంబొక చూడ్కిలోన గ్రహియించెం బో! యనవ్య ప్రపూ
ర్ణమతిప్రౌఢి; నమస్కరింతు హనుమా • తా! సీమహాశక్తికిన్ ॥12

శా॥ దేవారాతి దశాననాదిక జగ • ద్భీత్యావహాహాద్విపా
టీవస్పోథ మృగేంద్ర కీర్తియుతవా • లి ప్రోద్ధతప్రాణ సు
గ్రీవత్రాణధురీణతం బాలిచె మం • త్రిత్వప్రభన్నించు ప్ర
జ్ఞావిక్రాంతి; నమస్కరింతు హనుమం • తా! సీమహాశక్తికిన్ 13

మ॥ అమరశ్రేష్ఠసురేంద్ర దేవమునిము • ఖ్య స్తోమ సంస్తోత్రపా
త్రమహాగాఢనిరూఢ భక్తిపరతా • గ్రిత్స్వాప్న సుప్తిక్రియా
సమశ్రైవల్యపదప్రదానపటిమాం • చంద్రామరామేతి శ
బ్దమయంబయ్యె, నమస్కరింతు హనుమంతా! నీమహాశక్తికిన్ ॥14

మ॥ అవలీలన్నిజమూర్ధమందిడి యన • న్య ప్రాప్తిమైమర్గమో
గ్రవనిర్మోహ నసంతకోటిభువన • బ్రహ్మాండ భాండోదర
ప్రవచస్త్సోత్ర సముజ్జ్వలన్మహిమ శో • భా మూర్తి మద్రామచం
ద్రవిభూత్యంను; నమస్కరింతు హనుమంతా! నీమహాశక్తికిన్ ॥15

మ॥ సకలాజాండ చరాచర ప్రకర ర • క్షావర్తియూ రామమూ
ర్తికరాబ్జంబు భవమ్ముజాగ్రిములపై • బ్రీతిం బ్రసారించిమూ
మతవంశంబు సముద్ధరించిన జగ • న్మాన్యుండితండంచమం
దకలంజాటె; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి॥ 16

మ॥ బలముం, వీర్యము, నీతియుం, మధుర సంభాషిత్వముం, సర్వశా
స్త్రలపత్వాండితి, గాననైపుణి, కవి • త్వంబుం, మహాభక్తిపెం
పులమంత్రిత్వము, కార్యదీక్షయు, నజే • యత్వంబు, దైవత్వముం
గలిగెన్నికె; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి॥ 17

మ॥ పరిణతుల్ గాల్పెడిలోకరక్షకుని సే • వారక్తియున్, లోకబం
ధునిశిష్యత్వము, లోకశేవనుని స • త్ప్రానుత్వముం గర్గియుం
టనులోకోపకృతిం ప్రవృత్తియుం ప్రస • న్నత్వంబు వీర్యంబునీ
తనువుం జెందెఁ; నమస్కరింతు హనుమం • తా నీమహాశక్తికిన్ ॥18

మ॥ సముద్రంబు భవత్ప్రతాపము ! భుపం • జన్మించియుంగోటిగా
నమరత్వంబును జూరగొంటి నఖిలా • శాకీర్ణ దివ్యద్యుమం
ఘుమసౌరభ్యమయంబు ప్రోన్నతము నీ • కుం బ్రహ్మపట్టంబుసి
ద్ధముగానుండె; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్ ॥19

మ॥ భవదీయాద్భుత సాహసప్రథిత తీ । వ్రక్రూరవీర్యంబునే
దవుఁబ్రత్యక్షము! తావకాహ్వయము విన్నంతంబటాపంచలై
స్తవముల్ సేయుచు భూతరాక్షసపిశా • చవ్రాతముల్ పాఱవే
దవులంగ్రాల; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 20

మ॥ ఘనవిద్యాద్భుతమాంద్యదస్ఖలిత దీ • ర్ఘబ్రహ్మచర్యానవ
ద్యనిరూమంబు! నిరూఢభక్తిపర చి • త్తాబ్జస్ఫురన్మానవా
ళిని సత్పూర్తినరప్రసాదమునఁదే • లించుఁ భవద్దర్శనం
బనయంబుర్వి; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥21

మ॥ అతిభక్తుండవటంచు ద్వైతులు విశి • ష్టాద్వైతులద్వైతులున్
స్తుతిపాత్రోత్తమవర్తనాధికుఁడవం • చున్నాస్తికుల్, సర్వస
మ్మతదివ్యుండవటంచు నెల్లరును సం • భావింపఁగాఁగాంచినా
వతులఖ్యాతి; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 22

మ॥ అలవిద్యార్థులు, సేవకుల్, బుధులు, వే • దాంతుల్, మునుల్, భక్తవ
ర్యులు, యోగీంద్రులు, నీతివేదులు, సమా • త్యుల్, వైదికుల్, తార్కికుల్
బలయోధుల్, నినుమెచ్చబంతిగ నొన • ర్పన్ సర్వతఃప్రాజ్ఞతో
ద్భులమైయొప్పె; నమస్కరింతు హనుమం • తా! నీమహాకీర్తికిన్ ॥ 23

మ॥ ప్రకటానన్యకుశాగ్రబుద్ధివి! విభూ • గ్రస్పర్ధియావాలినే
టికిఁబో కార్పవు? వార్ధిఁదాటితివె యుఁజెనఁ • టిబం క్తికంపుందురా
త్మకుఁజెండాడవు సీతఁదేవు తగు సా • మర్థ్యంబునీ చెంతనుం
డకయా? కాదు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికిన్ ॥124

మ॥ పరిణుతానన్య సుదీర్ఘ యోజనుఁడవై • తా! యాత్మమున్ బ్రల్చియుఁ
ఘనమారానుబలంబుఁబెట్టితి పరీ • క్షం, దూతగాఁబోయియుం
గనదుద్యానవనంబు నూడ్చితివి, లం • కంగాల్చితత్యల్పవ
ర్తనమా? కాదు;నమస్కరింతుహనుమం • తా! నీమహాశక్తికిన్ ॥125

మ॥ సమరోపాయధురీణ సత్వోద్వహా! • సంజీవి శైలంధరా
గ్రమునంగానక డస్సి యున్సురని వే • న్యంబోయితో! నీకుమి
న్న మొయింబెంచిన ధావ్యమాలి నురసా • సాధింపఘా! నీకసా
ధ్యము లేదెందు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి ॥126

మ॥ ఒకరాజ్యంబున శిష్టులెల్లరు, మతిం • గొల్కొంటదుష్టుం డొకం
డికవేల్వోక్కటశిష్టుఁడే తక్కరుఁడౌటో • యీమాటసంధించి దు
ష్టకసంహారము శిష్టరక్షణము మె • చ్చంజేసె నీనీతి త
త్త్వకలాపంబు; నమస్కరింతు హనుమం • తా! నీమహాశక్తికి ॥127

మ॥ పరభృత్యత్వముఁ బూనివాఁడవఁట ◆ బ్రహ్మాండపాథోధురం
ధరతం దాల్చి; బుధుండనయ్యు ననిశో ◆ త్కృష్టాంతరుద్యద్భవ
త్సరపోద్గ్రీంధము మాపినావు! వినయా ◆ చ్ఛాదంబహో! నీమహో
త్తర తేజంబు! నమస్కరింతు హనుమం ◆ తా! నీమహాశక్తికిన్ ॥ 28

మ॥ చెలఁగున్ సంకటవేళ నైనను నిజ ◆ శ్రేయఃకరానర్ఘసం
కలనోత్పాదకయుక్తి పాటవము ◆ గ్రత్వంబు నీయందనన్
ఖలనిర్బంధితతావకీనతను దీ ◆ ర్ఘస్థూలవాలాగ్నితా
నలమే సాక్షి! నమస్కరింతు హనుమం ◆ తా! నీమహాశక్తికిన్ ॥ 29

మ॥ ఘనమాహాపాండితియో! మృదుత్వము! చమ • త్కారంబో! మా
ధుర్యమో

యొనయన్ రాని గభీరభావమొ? మఱిం • కేమున్నదో! యాదిద

ర్శనమందించుక నిప్పు భాషణమొన • ర్పన్ నిసమానుండు లే

డనరాముండు! నమస్కరింతు హనుమం • తా! నినుమహాశక్తికిన్ ॥ 30

శా॥ మా దేవుండె ఘనుండు మాకును సం • భావ్యుండనన్ రాకవం

జేదారిం జనఁగోరువాని కటులెం • తే నీచరిత్రంబగుం

గాదే! యైహికపారమార్థికఫలై • క శ్రీకరీదానదీ -

క్షాదర్శంబు; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ । 31

మ॥ భువనసంరంభము సృష్టిసంహరణముం • గా, దుర్గ్రోదండభుం
డనముం గాదు, శిలాధ్రిభూతమునికాం • తా శాపవిధ్వంసన
ర్తనముం గాదు; జగంబెఱుంగ దొకో శ్రీ • రామావతారార్థసా
ధనమూలంబు! నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ ॥ 82

మ॥ జనకక్ష్మాపసుతా వియోగభవ శో • కల్యార్త్యుజ క్లేశనా
శనసత్కృత్యభిరామరామ చరితాం • చత్సుందరాధ్యాయదీ
ధితిలేశంబు సమస్తబాధలడచున్ • ధాత్రిన్ విపద్బాంధవుం
డనఁగన్నీవె! నమస్కరింతు హనుమం • తా! నీ మహాకీర్తికిన్ ॥ 83

మ॥ అమలంబై, త్రిగుణాత్మకంబయి, త్రిలో • కారాధ్యమై, త్రిక్రియా
సముపేతంబు త్రిభావభావమయి, ప్రా • జాపత్యవిశ్వంభర
త్వమహాకారాద్రిములోంట ముప్పిరిగొనన్ • భాసిల్లె మూర్తిత్రయ
స్వరూపీయుండ; నమస్కరింతు హనుమంతా! నీ మహాశక్తికిన్ 184

మ॥ ఉపసర్గఘ్నదవైరినాశన సము • ద్యోగాత్మ భాగ్యాగ్రరూ
కపటత్యాగ మొనర్చి; పుణ్యజనతా • భావంబు దీపించు తు
ద్రపుప్రవ్యగ్రవనాచరించెదవహో! ధర్మాచలవ్యాప్తి నా
తవనాళంబు; నమస్కరింతు హనుమం • తా! నీ మహాశక్తికిన్ 185